# మనవి

సంగీతసాహిత్యములు రెండును సరస్వతీదేవికి రెండు కుచములన్నారు పెద్దలు. వాని నుపాసించినవాడే జ్ఞాని. పండితుడు అందు ఏదొక్కటి నుపాసించినను పండితుం డనవచ్చును గాని జ్ఞాని కానేరడు. సంగీతకళోద్ధారకులలో నగ్రగణ్యులన దగు త్యాగయ్య క్షేత్రయ్యలు యాంధ్రులు. త్యాగయ్య సార్థక నామధేయుడు సంగీతకళకు సుస్థానమునిచ్చి తన దేశీయులనేగాక అన్యదేశీయులనుగూడ తృప్తినొందించిన ధన్యుడు. ఆతని కృతు లమృతతుల్యములు, వానిప్రచార మెంతచేసినను సార్థకతగలదు. అందువలన మేము ఈ పొత్తమును నవ విధానములో మా ఆంధ్రసోదరులకు అందించుచున్నాము.

ఇట్లు

ప్రకాశకులు.



శ్రీ ర స్తు.

# త్యా గ రా య కృ తు లు

## నాటరాగము — ఆదితాళము

నిన్నే భజన సేయువాడను
పన్నగశాయి । పరుల వేడ లేను ॥ని॥
స్నానాదిజపతపయోగ - ధ్యానసమాధిసుఖ ప్ర
సీతానాథ సకలలోకపాలకా
త్యాగరాజసన్నుత ॥ని॥

## ఆరభి — ఆది

చాలాకల్లలాడుకొన్న సౌఖ్యమేమిరా
కాలముపోనుమాట నిలుచును । కళ్యాణరామసీతో
సాస్సధప । పామగరి । మగరి । సరిసధా । సరిపమ
సరిమపధసరిధమగరి । ససరి । ధధస । మపదస
సధపధసమపధ । రిపమ । సరిమపధ ॥చా॥
తల్లి తండ్రినీవైయుండ । దక్కినభయమేలాయని
పలుమారు నన్నేనే బాసలుచేసి

ఇలలోసరివారలలో । నెంతో బ్రోచుచుండి
పెద్దలతోడబల్కి-చెప్పించి । త్యాగరాజునితో ॥సా॥చా॥

కాంభోజి — ఆది

ఓరంగశాయీయని । పిలచితే । ఓయనుచురారాదా
సారంగధరునిజూచి । కైలాసాధిపుడుగావలేదా ॥ఓ॥
భూలోకవైకుంఠమిదియని । నీలోన నీవే యుప్పొంగి
శ్రీలోలుడైయుంటేమా । చింతతీర్చుటెన్నడో
మేలోర్వలేనిజనులలోనే।మిగులనొగిలి దివ్యరూపముస
ముత్యాలసరులు । యురమున గననచ్చితి
త్యాగరాజహృద్భూషణ ॥ఓ॥

శ్రీరంజని — ఆది

బ్రోచేవారెవరు రఘుపతే । నినువినా
శ్రీరామా, నెవరునంవరనీసరి-సకలలోకనాయక ॥బ్రో॥
దేవేంద్రాదులు మెచ్చుటకులంక
దయతో దాన మొసంగినసదా ॥బ్రో॥
మునిసవనంబుజూడ వెంటజని
ఘనమారీచాదులహతంబుచేసి ॥బ్రో॥
భవాబ్ధితరుణోపాయము నేరని । త్యాగరాజుని కరంబిడి

# త్యాగరాయ కృతులు

## అఠాణా — ఆది

ముమ్మూర్తులు గుమిగూడి పొగడరే
ముచ్చట వినుకోరే ॥ము॥
సమ్మతిగా రాజకొమరుని గనిని
సంభ్రమము దీరగ రాముని ॥ము॥
రోసముతో రఘురాముని గుణముల
రూఢిగ తమ గుణముల నెంచరాని
త్రాసునగడ సరిపోవగ నేరని
త్యాగరాజనుతు డనుకోయని ॥ము॥

## వీరవసంతము — ఆది

నన్ను బ్రోవ నీకింత తామసమా
నాపై నేరమేమి బల్కుమా ॥న॥
చిన్ననాడె నీ చెలిమి గల్గగోరి
చింతించలేదా, శ్రీరామ ॥న॥
నిజదాసవరులగు తమ్ములతో
నీవు బాగా బుట్టలేదా! నిజరాజరక్షక తనయులను
గరుణించలేదా. త్యాగరాజనుత ॥నన్ను॥

## అపురూపము — ఆది

ఎవరికై యవతార మెత్తితివో
యికనైన దెలుపవయ్యా । రామయ్య ॥ఎ॥

అవనికి రమ్మని పిలిచిన మహారాజెవరో
వానికి మ్రొక్కెదను రామా ॥ఎ॥
వేదశాస్త్రనీయమహా నామముతో
విధిరుద్రులకు మేల్మియగు రూపముతో
మోదసదన మగువటుచరిత్రముతో
మునిరాజవేషియౌ త్యాగరాజనుతని ॥ఎ॥

కళానిధి — ఆది

సార్వభౌమ సాకేతరామ మన
సారబల్కరా దేవతా ॥సా॥
పార్వతీ రమణార్చిత పాదరమా
భక్తవంద్య పరాత్పర దీనబంధో ॥సా॥
ముద్దుముద్దుగా మాటలాడితివి
ముందుగానె సదా వెతజెందుచును ॥సా॥
కద్దుకద్దనుచు జిరకాలమున
గరుగుచుండుననితో త్యాగరాజనుత ॥సా॥

ఫలమంజరి — ఆది

శ్రీనరసింహ మాం పాహి
క్షీరాబ్ధికన్యకారమణ ॥శ్రీ॥
దీనార్తిభయహర భవ్యగుణ
తిలితనయతిమిర సూర్యాత్రినేత్ర ॥శ్రీ॥

ప్రహ్లాదపరాశరనారదహృ
త్పంకేరుహనీరజబాంధో
ఆహ్లాదకర భవరోగహర
అనవరతత్యాగరాయనుత॥ శ్రీ॥

హరికాంభోజి — రూపకము

ఉండేదేరాముడొకడు ఊరక చెడిపోకెమనసా
చండమార్తాండమధ్య । మండలమున నుజెలంగు॥ఉం॥
తామసాదిగుణరహితుడు । ధర్మాత్ముడు సర్వసముడు
క్షేమకరుడు త్యాగరాజచిత్తహితుడు జగమునిండియుం॥

వరాళి — ఆది

వరనారదనారాయణ స్మరణానందనుభవముగల॥వ॥
శరదిందునిభాతఘనాఘన । సారముగానుబ్రోవుమిక॥వ॥
సకలలోకములకు సద్గురువనుచు ॥
సదానేతడనుచు హరియుప్రకటంబుగ కీర్తినొసగినే
బాగుగా త్యాగరాజనుత॥వ॥

నాటకురంజి — రూపకము

సుజనజీవనా । సుగుణభూషణా రామ ॥సు॥
భుజగభూషణా । శ్రితబుధజనావనా
అజవందిత ధృతచందన । దశతురగమారామ ॥సు॥
చారునేత్ర శ్రీకళత్ర । శ్రీరమ్యగాత్రా
తారకనామ సుచరిత్ర । దశరథపుత్రా తారకాధిపా

ఘనసధర్మపాలనా । తారయరఘువరనిర్మల
త్యాగరాజనుత ॥సు॥

### తోడి — ఇది

కొలువమరెగద । కోదండపాణి ॥కొ॥
నలువకు పలుకుల చెలియకు రుక్మిణికి
కలికి సీతకు లక్ష్మణునికరుదైన ॥కొ॥
తెలవారలేచి వెలయుచు తంబుర
చేకొని గుణముల చెలువొంద బాడుచు
శ్రీకరునికి శ్రీచింతామణికి
ఆకలిదీర పాలారగింపనుచేసే ॥కొ॥
వినవయ్య సూర్యప్రొద్దువేళ నానాథునికి
చనువున పన్నీట స్నానముగావించి
ఘనునికి దివ్యభోజనములు బెట్టి
కమ్మనివిడెమొసగుచు మరువక సేవించె ॥కొ॥
భాగవతులగూడి బాగుగఘననయ
రాగములచే దీపారాధన మొనరించి
వేగమె శ్రీహరివిరులపై పవ్వళించ
జోకొట్టి త్యాగరాజ సుముఖుని లేపెకొ ।

### తోడి – ఆది

ండతేరరాదా । మనసక ।
కడలేక భజన జేసినీ । ఎడగల్గి నిజభక్తరలకు తెలసిత

గాఢచిత్తశోకికమనెడి । కాలబద్ధునికి నిజదాసుడై
వెలసిల్లు త్యాగరాజమాటవిని ॥క॥

తోడి — ఆది.

దాశరథే నీఋణముదీర్ప నాతరమా
పరమపావన రామా ॥దా॥
ఆశదీర దేశములను । ప్రకాశించేసినరసికశిరోమణి॥దా॥
భక్తిలేనికవిజాలవరేణ్యులు। భావమెరుగలేరునికరలోచన
భక్తిముక్తి గలుగునని కీర్తనములు
బోధించిన త్యాగరాజకరార్చిత ॥దా॥

తోడి — రూపకము.

బృందావనములోపల । గోవిందరాకాచంద్రాదన॥బృం॥
సుందరాంగ ధృతధారంగ–సుజనారితిమిరపతంగ ॥బృం॥
మాధవ శ్రీరమణీ మణి – మదనరహితమిత్ర
శామదాసదాస త్యాగరాజనుత చరిత ॥బృం॥

శంకరాభరణము — ఆది.

మరియాదగాదురా కరుణాకర వారిని
వీరిని సరిచేసి చూచుచుండేది ॥మ॥
రాగము తాళము రక్తిభక్తిజ్ఞానయోగము
మరియును రాగములేని

భాగవతులు ధరశయనులేగాని
త్యాగరాజార్చిత తారకచరిత ॥మ॥

ఖరహరప్రియ—ఆది.

విడెము శేయవె - నను విడనాడకవే
పుడమితనయచేతిమంచి - మడుపులనుచుతలచితి ॥వి॥
రాజమాన్యుడా స్వామి శ్రీ - రతనమ్మునడిగబట్టి
తేరిల్లునటన దేవదేవ - జాజికాయ యేలకుల
జాపత్రి వక్కలాకుల - రాజరాజవర
త్యాగరాజు ప్రేమతో నొసంగేటి ॥వి॥

దర్బారు - ఆది.

యోచనా కమలలోచనా - ననుబ్రోవ ॥యో॥
సూచన తెలియక నరుల - యోచనజేతునను చు నీకు
లోచనాద్యుతి విధిదాయకవిలోచనా-
నన్ను బ్రోవుమినింక ॥యో॥
పావననిజభక్త - విజయపాపవిమోచన
గల బిరుదులెల్ల గలవని - నేచనక్షతవిపినచరపతాభి
షేక త్యాగరాజపూజిత ॥యో॥

దర్బారు - ఆది

నారదగురుస్వామీ - యికనైన
నన్నాదరింపవేమి - యారువేమి ॥నా॥

సాలెకుసంగీతయోగనైగను
పారంగతుడైన పరమపావన నా॥
ఇతిహాస పురాణాగమ చరితము
లెవరివల్ల గలిగె – పతినిదానమివ్వ బుద్ధిసత్య
భామకెటులగలిగె – క్షితిని త్యాగరాజవినుజ నమ్మిత
చింతదీర్చి ప్రోష్ఠాదుని బోధిచి నా॥

కన్నడ – రూపకము

శ్రీనారదనాదసరసీరుహ – భృగంశుభాంగ శ్రీ॥
దీనమానరక్షక జగదీశ భేదసంకాశ శ్రీ
వేదజనితవరవీణావాదనుత తత్వజ్ఞ
భేదహారధృతాపరహిత – కేచరవినుతా
యాదవకులస్తుత దామోదర హృదయమునివర్యా
సీతత్యాగరాజనుత శ్రీకరమాంపాలయ శ్రీ॥

ముఖారి – రూపకము.

ఎంతని నేవర్ణింతునుశబరీ – భాగ్య మెం॥
కాంతలు వరదంతులు – జగమంతనిండియుండగ ॥ఎం॥
కనులార సేవించ కమ్మనిఫలముల నొసగే
తనువు పులకరింపపాదయుగములకు మొక్కి
ఇనకులపతిసముఖంబున – పునరావృత్తి యుతపదమువ
బొందిన – త్యాగరాజఘనుడాపుణ్యంబున ॥ఎం॥

అఠాణా — ఆది.

కట్టుజేసినావు — రామబందు
వట్టుమితము తేనట్టి దేవతా
మతములలో జొరబడుదామంటె ॥క॥
మామతములను లలాటమున — పితామహుడు రాయ
లేదనుచు — మరిమరి కామమదములకు హేతువనుచు
నిష్కారణమున త్యాగరాజుకుత్రోచే ॥క॥

వరాళి — ఆది.

కనకనరుచిరా — కనకవసననిన్ను
దినదినమును మనసున చనువుననిన్ను ॥క॥
కలకలమనుముఖకళగలిగినసీత
కులుకుచు వోరకన్నులజూచెనిన్ను
సతతము ప్రేమపూరితుడగు త్యాగరాజనుత
ముఖజితకుముదనుతవరదా నన్ను ॥క॥

ఖరహరప్రియ — ఆది.

మనవినివినుమా — మరువసమయమా
కనుగొనగోరిదు — ష్కల్పనమానితి
కనికరమునవినసు — బాధుచునున్నా ॥మ॥

రుచుమార్గములను చింతింపలేదా
పరమదయాకర భక్తమనోహర
ధరాధిపకరార్చిత త్యాగరాజు ॥మ॥

## ముఖారి – ఆట

క్షీణమైతిరుగా జన్మించేసిద్ధమానురా । ఓమనసా ॥క్షీ॥
గీర్వాణనాటకాలంకార వేదపురాణ
యజ్ఞజపతపాదుల ఫలములు ॥క్షీ॥
పదిచేసినజగన్నాధుని శిరమున
హృదయమున వహించి – పదిలమైనసత్పదమునొసంగే
పాటిత్యాగరాజవరదుని భజనము ॥క్షీ॥

## కేదారగౌళ – రూపకము

వేణుగానలోలునిగన – వెయిగన్నులుగావలెను
అలివేణులెల్లదృష్టిజుట్టివేయుచు బాడుచురాగా ॥వే॥
వికసితపంకజవదనలు – వివిధగతులనాడగా
ఒకరికొకరు కరములనిడి
మోరకనులుచూడగా – శుకరవములుగల తమను బ
సొగసుగానుపాడగా సకలసురలు త్యాగరాజ

శహాన - ఆది

గిరిపై నెలకొన్న రాముని - గురితప్పక గంటి ॥గి॥
పరివారులు విరిసురటులచే నిలబడి
విసరుచు కొసరుచు సేవింపగ ॥గి॥
పులకాంకితుడై యానందాశ్రువులనింపుచు మాటలాడ
వలెనని - కలువరింపక నేనదిపూటలపై
గాచెదననిన త్యాగరాజాప్త ॥గి॥

యమునా - రూపకము

గానమొసగరాదా - గరుడగమనరాదా
నీనామముచే నామతినిర్మలమై నీపద ॥గా॥
పరమాత్ముడు జీవాత్ముడు పదునాలుగు లోకములలో
వరకిన్నర కింపురుష - నారదాదిమునులు
పరిపూర్ణ నిష్కళంక వధశృంగారుణ్ణి వరత్యాగరా
జార్చిత - వరములకునైన - గానమొసగ ॥గా॥

వేగవాహిని - ఆది.

చల్లగ నాతో బలుకుమీరామా
సారసవదనా సాధుసంత్రాణ.
ఉల్లమునను నీపై మరులుకొన్నారా
ఉరగశయన నాతప్పులెంచక నీవు ॥చ॥

సిరవధిశహార నిఖిలాధారా ।
వరకామినిదూరా పాపవిదారా
సరసిజనేత్ర శ్యామలగాత్ర
వరత్యాగరాజ హృద్వారమిత్రా ॥చ॥

అఠాణా — త్రిపుట.

చెడేబుద్ధిమానురా । ఇడేపాత్రమెవరో చూడరా ।చె।
పూర్వాస్థితికి తగుఫలము గలుగునని పెద్దలు
బల్కగ వినలేదా । మనసా
శ్రీవాసుదేవ సర్వమనుచు
చింతించు వరత్యాగరాజ నినుగని ॥చె॥

మోహన — ఆది

ననుపాలింప నడచివచ్చితివో । నాప్రాణనాథా
వనజనయన నీమోమును చూచుట జీవనమని
నెనరున । మనసుమర్మము దెలిసి ॥చె॥
సురపతి నీలమణిభతనువుతో
యురమున ముత్యపుసరులచయముతో
కరమున శరకోదండ కాంతితో
ధరణితనయ శ్రీ త్యాగరాజార్చిత ॥న॥

## ఖరహరప్రియ - ఆది

పట్టివిడువరాదు । నాచేయి
పుట్టిననాడే నిజభక్తిని మేడగట్టి
గుట్టుచెదరక నాచేయి ॥ప॥
నిత్యానిత్యములను బోధించి
కృత్యాకృత్యములను దెలిపించి
ప్రత్యేకుడు నీవనికనుపించి
భృత్యుడైన త్యాగరాజుని చేయి ॥చ॥

## కన్నడ - చాపు

భజరే భజమానసరామం
అజముఖసురవినుతం శుభ చరితం ॥భ॥
నిర్మితలోకం నిర్జితశోకం
పాలితసుగుణం మధురామృతపానం ॥భ॥
శంకరమిత్రం శ్యామలగాత్రం
భూశమశాంతం భూజాకాంతం
వారముఖిలదం త్యాగరాజ హృద్ధ్వాంతం ॥భ॥

## సురటి - రూపకము

భజనపరుల కేలగలుగు దండపాణిభయము తాను ।
రజతాద్రిసురేశులకై యూహాతీతమొసగు తాను ॥భ॥

అండకోట్లు నిండిన కోదండపాణి ముఖమున
పుండరీకమునుచూచి వ్యాజపలుప్రచు
నిండుప్రేమతోకరంగు నిష్కాములకు కోరవే
దండపాణిదానుడై త్యాగరాజుసేయురామ

శంకరాభరణము – రూపకము.

భక్తిబిక్షమియ్యవె – బాగుగ నిన్నుదేహా
ముక్తికఖిలశక్తికి త్రిమూర్తుల కాధారమైన ॥భ॥
ప్రాణము లేనివానికి బంగారు పాగజుట్టి
ఆణిముత్యపుసొమ్ము లమరగబెట్టి
రామాయుధులకును పురాణాగమ వేదులకును
తర్కశాస్త్రజ్ఞానులకును సూటిగాగ
త్యాగరాజు సేయురామ ॥భ॥

మోహనరాగం–ఆది.

మోహనరామా – ముఖజితసోమముద్దుగ బల్కుమా
మోహనరామా – మొదటిదైవమా
మోహామునీపై మొనసియున్నదిరా ॥మో॥
ధరమను జావతారమహిమ విని
సురకిన్నర కింపురుష విద్యాధర
వనమృగ పక్షివానర జాలములచే

గిరివెలయుసీతా - వరచిరకాలము గురితప్పక
మైమరచి సేవించరె-వరత్యాగరాజవరద జగన్మోహన

శుద్ధరంజని - ఆది.

మునుపే తెలియకపోయెనా
మునినుత దయలేదాయె నా
చనువిసుమంతలేక నన్నలయించి వేడుకచూచేటిటు
ఆనాటి మంచినడత జూచి నీవత్యంతకృపచేయలేదా
ఈనాడు నీబుద్ధి యీలాగో
యినకులతిలక శ్రీత్యాగరాజార్చిత ॥ము॥

పూర్ణషడ్జమము - ఆది.

శ్రీమానినీ మనోహర
చిరకాలము నామాట యొకటిరా
శ్రీమంతులౌ నీసోదరులు జేయు
నీదుపాదసేవను కోరితిని ॥శ్రీ॥
ధర్మాద్యఖిల పురుషార్థములు
దాసార్థసీమాప మబ్బిన
మర్మంబు వేరేయున్నది మన్నించు
మిక త్యాగరాజనుత ॥శ్రీ॥

శ్రీరంజని - ఆది.

సరియెవ్వరే శ్రీజానకి
నీ, పరమాత్మునికై గడదేరినదా

శిరులిచ్చుటకు జేసి గొల్చేనా, నీ ॥న॥
వనమందు భయంకరమైన తావున
నించుక నీమనసు దెలిసి
కనకాంగి యందంబున రాజసుఖంబును గల్గిం
నీవె త్యాగరాజనుత ॥న॥

బేగడ – ఆది.

నాదోపాసనాచేసి – శంకర
నారాయణ విధులన వెలసిరి ఓ మనసా
వేదోద్ధారులు వేదాతీతులు
విశ్వమెల్ల నిండియుండేవారలు ॥నా॥
మంత్రాత్ములు యంత్రతంత్రాత్ములు మహా
మంత్రాములెన్నో గల వారల
తంత్రీలయస్వర గానవినోదులు
త్యాగరాజు వంద్యులు స్వతంత్రులు ॥నా॥

నినువినా సుఖముగాన – నీరజనయనా
మనసుకెంతో ఆనందమై పులగరించగ ॥ని॥
రూపము ప్రతాపము సరససల్లాపముగల ॥ని॥
కరుణారస పరిపూర్ణ – వరముని దువా ర్తగల ॥ని॥
రా.. రసిక సాగరహిత – త్యాగరాజభాగధేయ॥

## కళ్యాణి - చాపు.

నిధిచాలసుఖమా రాముని
సన్నిధిసేవ సుఖమా
నిజముగబల్కుమీ మనసా
దధినవనీత క్షీరములురుచో
దాశరథి ధ్యానభజన - సుధారసమురుచో ॥ని॥
దమశమను గంగస్నానము సుఖమా
కర్దమదుర్విషయ కూపస్నానముసుఖమా
మమతాబంధన యుతనరస్తుతి సుఖమా
సుమన త్యాగరాజనుత కీర్తనసుఖమా ॥ని॥

## భైరవి - రూపకము.

ఉపచారము జేసేవా - రున్నారని మరువకురా
కృపగావలెనని సేనీకీర్తిని బలుకుచు నుండగ ॥ఉ॥
వాకిటనే పనిలముగా వాతాత్మజు డున్నాడని
శ్రీకరులగు నీతమ్ములు జేరియున్నారని
యేకాంతమునకు జానకి యేర్పడి యున్నాదని
శ్రీకాంతా పరులెవ్వరు - శ్రీత్యాగరాజవినుత ॥ఉ॥

## భైరవి-చాపు.

ఉపచారములను చేకొనవయ్యా
వురగరాజ శయనా

చపలకోటిబింబరధర శ్రీజానకీపతి దయజేసినావు ||ఉ||
కపటనాటక సూత్రధారివై
కామితఫలము లొసంగేరామ
అపరిమితానవరసము పొసగిన
నవరంజకగాత్రములు నీకేతగునయ్యా ||ఉ||
మెరుపుతీగెల రీతిని మెరసిన
కరుకుబంగరు కాడలమరిన
శరదిందుద్యుతి సమానమౌ
చామరయుగములు నీకేతగునయ్యా ||ఉ||
జాజులు సంపెంగలు
మరువంపు విరజాజులు
కురువేరువాసనలు, రాజమానసమును నిజముగ త్యాగ-
రాజవినుత నీకేతగునయ్యా ||ఉ||

## శహాన — చాపు

ఊరకేగల్గునా - రామునిభక్తి
సారెకునుసంసారమునజొచ్చి
సారమనియెంచు వారిమనసున ||ఊ||
ఆలుసుతులు చుట్టాలు వరసధనాలు
కాయఫలాలు కనకధనాలు
గలవిభవాలకని—యస్థిరాల వైభాగ్యశాలులకుగాక ||ఊ||
మంచివారిని పొడగాంచి సంతతము సేవించి

...నపాలకించి - మాదినపహించి
...గ్గము హాఠియని యొంచి
దెలిసిబోధించుమని - పూజించువారికిగాక ॥ఊ॥
రాజసగుణయుక్తపూజల నొనరించు
రాజనన్నుత త్యాగరాజునిజిహ్వపై
రాజిల్లుపరమంత్రరాజమనియె సదా
బలుచే మహారాజులకుగాక ॥ఊ॥

కళ్యాణి - ఆది

ఏతావునర - నిలకడ నీకు
యొంచిచూడ నగుపడవు సీతా గౌరి వాగీశ్వరీయను
శ్రీరూపములందా గోవింద ॥ఏ॥
భూకమలార్కానిలనభమంద - లోకకోటులంత
శ్రీకరుడగు త్యాగరాజకరార్చిత
శివమాధవ బ్రహ్మాదులయందా ॥ఏ॥

శంకరాభరణము - ఆది

ఏమినేరమో నన్నుబ్రోవ
నెంతభారమో - నావలన నీకెంతభారమో
సామజవరదుడనిమునుపేసత్కీర్తిగనలేదానాపై ॥ఏ॥
దీనబంధువని దేవ దేవుడని
మానఘనుడని ధర్మాత్ముడనుచు
జ్ఞానసుధ సుగుణగానముసేయ
తానజూడవు త్యాగరాజార్చితనాపై ॥ఏ॥

### దేవగాంధారి – ఆది

కొలువైయున్నాడే కోదండపాణి
సలలితమతులైసారెకుశీలులై
పలుచుచుకోరివచ్చి సేవింపరె ॥కొ॥
జనకజభరతాదులతో మంచినైవేద్యంబు
చనువున వేడుకనారగించి మెరుపుకోట్లగేరు
కనకపటము సొమ్ములను ధరించి
వేదోక్తమైన సకల వచనములనే
సంతోషించి శ్రితులపోషించి ॥కొ॥
పరమగు వాసనలు పరిమళింప సన్నుతింప
వెలిగెడి సురవారసతులు బాగుగనటింప
అదియుగాక పారాశర నారదమును
లెల్లనుతింప యెంతెంతో నెవరున
సురపతి వాగీశుల సేవింప మేనుపులకరింప
అపుడు రాజముఖుడు శేషశయ్యపై
చెలంగగ నిపుడు షోడశ కుమారినుగంధ
నమ్మినవారలకే కడకంటను కోరినవరము
శ్రీత్యాగరాజు అడుగడుగుకు మడుపు
శ్రీరామయ్య ॥కొ॥

### సురటి – ఆది.

గీతార్థము – సంగీతానందము
నీతావున జూడవె యోమనసా

చరణాబ్జమునడికొన్న వాత్తాత్మజుని
బాగ దెలుసురా హరిహయ భాస్కర
కాలాది కర్మములను మతములను
సుకర్మముల నెరింగిన
మానవావుడా హరిహయ వినుతుడా
వర త్యాగరాజ వరదుడు సుఖమా ॥గీ॥

సావేరి—ఆది.

పరిదాపు లేక వేడితె దయారాదేమి
కరిదాసములు గలిగిన కతుణించి బ్రోవవో ॥ద॥
అలనాడు సురవైరి బాలుచూచితివిగాని
వలచి పాదములు నమ్మితె వర
వియ్యాలోచునా త్యాగరాజవినుత ॥ద॥

పూర్ణచంద్రికా — ఆది.

దండము పెట్టేనురా — కోదండపాణిచూడరా
అండజవాహన మార్తాండ చంద్రలోచన
కుండలిశయన బ్రహ్మాండనాయకా నీకు ॥దం॥
పేరుగా ప్రతిష్ఠగా నూరికె నిన్నునమ్మితి
నూరివారు పేరువారు నొక్కజాతివారు కారు
దాసియని చెయిబట్టి బ్రోవు
త్యాగరాజార్చిత నీకు ॥దం॥

హరికాంభోజి — ఆది

నెనరుంచినాను అన్నిటికి – నీదాసుడనని నేనూ
నీదుపై ఘనాఘనజీమూతా
శుకవననిధిగాంభీర్య నీపాదములపై ॥నె॥
కలిలో మాటలు నేర్చుకొని
కాంతలను తనయుల బ్రోచుటకు
కుశలాత్ముడై నెనరున
శ్రీత్యాగరాజాప్త నీయెడ ॥నె॥

పూరికళ్యాణి — ఆది

ఫణిపతిశాయి మాంపాహిపాలితార్థ ॥పాహి॥
మణిమయమకుటవిరాజమాన
మన్మథకోటిసమాన ॥ఫ॥
భుజగశయన పంకజనయన
సుజనగణావన సుందరవదన
గజముఖపాలన గరుడవాహన
నీరజనయన త్యాగరాజ వినుతనో ॥ఫ॥

ఖరహరప్రియ — ఆది

రామా నీయెడప్రేమ రహితులకు
నామరుచి దెలుసునా ఓసీతా ॥రా॥

కామినివేషధారికి సాధ్వినడత
లేమైనా దెలుసునారీతి సీతా ॥రా॥
తనసౌఖ్యము తానెరుగక
నోరులకు తగుబోధనసుఖమా
ఘనమగు పులిగోరూపమైన
త్యాగరాజనుత శిశుపాలుగల్గునా ॥రామా॥

## సురటి — ఆది

రామదైవమా రాగరాగలోభమా
మోముచూపుమా జాగనోర్మోహనకరమా ॥రా॥
దొంగవాడ లేరయిల్లు బంగారాయనా
రంగడావిభీషనునికి పంగనామమిడినరీతి ॥రా॥
వెన్నతాభుజించి గోపకన్యముఖమునందు నీవు
తిన్నగా నలంటినట్లు దీనరక్షకాసీతా ॥రా॥
నేర్పుచూపుమా యంగలార్పు బాపుమా
ఓర్పుగల్గి త్యాగరాజు రొక్కసారి శరణంటె ॥రా॥

## దేవగాంధారి — ఆది

వినరాద నామనవి కనకాంగ కావేటిరంగా
శ్రీకాంతలెల్ల కామించి బిలచితే ॥వి॥
తేజినెక్కి బాగా తెరువునరాగ
రాజసుతులగూడి రమ్మని బిలిచితె

భాగధేయ వైభోగరంగ
శ్రీ త్యాగరాజనుత తరుచుగ బిలచితే ॥ని॥

సురటి — ఆది

నేరనమ్మితి నీవేగతి – వేమారుమారుకు సీతాపతే
ఈరేడులోకములు – కాధారుడగు నిన్నువినా ॥నే॥
బృందారకాదిముని బృందాంశుకా సనక స
నందన శ్రీ నారదాది – బృందార్చిత శ్రీధరా
ఘనందరాకులగు శ్రీ త్యాగరాజ వినుతవినా ॥నే॥

ఆనందభైరవి – ఆది

శాంతములేక సౌఖ్యములేదు
సారసదళనయనా – దాంతులకైన వేదాంతులకైనా ॥
ఆగమశాస్త్రము లన్నియుజదివిన
బాగుగ సకలహృద్భావము దెలిసిన ॥శాం॥
యాగాది కర్మములెన్నియు జేసిన
బాగుగ వెలయు విరాగులకైన ॥శాం॥
రాజాధిరాజ మహారాజ త్యాగ
రాజవినుత రక్షకునికైన ॥శాం॥

శ్రీరంజని — ఆది

సరిఎవ్వరే శ్రీజానకిని ॥స॥
పరమాత్ముని కైనటి చేసినా

సిరులిచ్చుటకు చేరిగొల్చినా ॥నీ॥
వనమందు భయంకరమైన తాపుచ
నింపుగ నీమనసు దెలిసి కనకాంగి
యందంయంబున రాజసుఖంబును గల్గజేసి
నీవు త్యాగరాజనుత ॥నీ॥

## యమునాకళ్యాణి — ఆది

సందేహము తీర్పవయ్యా
సాకేతపురనిలయ మారామయ్య ॥సం॥
సందార్చిత పదయుగములు మేలో
నాగనీకమగు పాదుకాయుగంబు మేలో
సంవరమానులెల్ల శరణంబులలో స్మరియించ నీన్న
పరమొసంగితి వనదార్చ నాచే పాదుకలు
ధరణి యొసంగు త్యాగరాజు భాగ్యమాయె ॥సం॥

## శూలిని — రూపకము

సొగసుగా మృదంగతాళము
జతగూర్చి నిన్ను సొక్కజేయు ధీరులెవరో
నిగమచరార్థము గల్గిని - నిజవాక్కులతో
సర్వశుద్ధముతో ॥సొ॥
అతివిక్రమ సద్భక్తిని యతిద్రాక్షారస

నవరసయుత కుశలాచే భజించిన
ముక్తి త్యాగరాజునకు తరమా (శ్రీ)రామా ॥

ఈశమనోహరి – రూపకము.

సొగసు చూడతరమా నీ ॥సొ॥
నిగనిగమను కపోలయుగముచే మెరయు మోము ॥సొ॥
అమరార్చిత పదియుగ
యభయమిచ్చు కరయుగము
కమనీయ సుందర వదిత
కామకామ రిపునుత నీ ॥సొ॥
చిరునవ్వును ముంగురులు మరి కన్నుల తేట
వరత్యాగరాజార్చిత వందనీయ యిటువంటి ॥సొ॥

కన్నడ – ఆది.

సుఖియెవ్వరో రామ నామ
సుఖియెవ్వరో సుముఖి యెవ్వరో
అఖిలసారమగు — తారక నామ ॥సు॥
సత్యము తప్పక సకలలోకులకు
భృత్యుడై దేవభేదము లేక
నిత్యమై స్వరజ్ఞానము తో నిర
తరము త్యాగజనుత ॥సు॥

హరికాంభోజి—ఆది.

నేనెందు వెదకుదురా
శ్రీహరి నాలుగు మోములవాని
మొరనాలకించి రానినిన్ను — నే
కలుషాత్ముడై దుష్కర్మయుతుడై
తలమారు దుర్భాషియై
ఇలలో భక్తాగ్రేసరులలోను
త్యాగరాజ పూజితహరి ॥నే॥

మాయామాళవగౌళ — రూపకము.

తులసీదళములచే సంతోషముగా పూజింతు
పలుమారు చిరకాలము—పరమాత్ముని పాదములను ॥తు॥
సరసీరుహ — పున్నాగచంపక పాటలకురువక
కరవీరమల్లిక సుగంధరాజ సుమములధర వెలసి
ఏకపతి యానుము ధర్మాత్ముని సాకేత
పురవాసుని శ్రీరాముని
వర త్యాగరాజనుతిని ॥తు॥

కళింగము — రూపకము.

నినువినా నామదెందు నిల్వదే శ్రీహరి — హరిహరి
కనులకు నీసొగసెంతో కమ్మియున్నదీ గనుక ॥ని॥

నీసుకథలు వీనులందు నిండియున్నది
శ్రీధర నీనామము నోట వెలసియున్నదీ గనుక ॥ని॥
నేను యెచట చూచినాను నీవై యున్నదీ
భానువంశ తిలకానీభక్తుడంచు పేరుగనుక ॥ని॥
కపటమౌ మాటలెల్ల కమ్మనైనదీ — నా
తపమురియొక్క ఫలమునీవె త్యాగరాజసన్నుత ॥ని॥

## సూర్యకాంతము—ఆది.

ముద్దుమొగము ఏలాగు చెలంగునో
కద్దనుచు చిరకాలహృదయము
కరగికరగి నిల్చువారికెదుట రాముని ॥ము॥
మానసునిర్మల భూసురకృతమౌ
మంచిపూజాఫలమొ తొలుతటి తాపమొ
ఘననిభ దేహునిజన స్వభావుని
ధనపతిసఖుడైన త్యాగరాజనుతుని ॥ము॥

## కిరణావళి — ఆది.

పరాకునీకేలరా — రామ
చరాచరంబులవసించేవుసారసాక్షుడౌ నాపనులంటు ॥ప॥
మురారి శబరియొసంగిన యట్లానే
భుజించుకొన్న శేషమౌ రామ

ధరాధలమున గుహునివలెనే
పాత్రతల్పముల చింతించిని శ్రీత్యాగరాజుపై ॥ఓ॥

వరుణప్రియ - ఆది.

కలిగియుంటేగాదా కల్గును
కామితఫలదాయకా
కలిమియింగిత మెఱుగక నిన్నాడుచుంటి
చలముజేయక నాతలను చక్కనివ్రాత ॥క॥
భాగవతాగ్రేసరులగు నారద
ప్రహ్లాదపరాశర రామదాసులు
బాగుగ శ్రీరఘురాముని పాదముల
భక్తిజేసినరీతి త్యాగరాజునికిపుడు ॥క॥

ఆందోళి - రూపకము.

వినవే, ఓమనసా
మన సెఱింగి దుర్మార్గమునే
పడిపొరలుచు చెడకె ॥వి॥
ఈ నడతలు పనికిరాదు
యీశ్వరునికృప గలుగబోదు
ధ్యాసభజన సేయవే
త్యాగరాజు మనవి ॥వి॥

# గౌరీకళ్యాణము.

## శంకరాభరణము - ఏకతాళము.

గౌరికళ్యాణ వైభోగమే
లక్ష్మీకళ్యాణ వైభోగమే ॥గౌ॥
పవనజాస్తుతపాత్ర పావనచరిత్ర
రవిసోమయుతనేత్ర రమణీయగాత్ర ॥గౌ॥
భక్తజన పరిపాల భరితశరజాలా
భుక్తిముక్తిదలీల భూదేవపాలా ॥గౌ॥
పామరాసురభీమ పరిపూర్ణకామా
శ్యామజగదభిరామ సాకేతధామా ॥గౌ॥
పరమేశనుతగీత భవజలధిపోతా
తరణికులసంజాత త్యాగరాజనుత ॥గౌ॥

## హరికాంభోజి - ఏకతాళము.

రామా నన్ను బ్రోవ రావేమొకో
లోకాభిరామ చీమలో బ్రహ్మలో కేశవాదులలో
ప్రేమమీర చెలగియుండె బిరుదువహించి కాదా ॥రా॥
మెప్పులకై యింతకన్న తప్పుబడక వెర్రిపెగి
తప్పుపనులు లేకయుండె
త్యాగవినుత సీతా ॥రామా॥

### నాయకి - రూపకము

కనుగొన సౌఖ్యము కమలజునకైన గల్గునా
దనుజవైరియగు రామునిదయ గలిగిన యతనికివినా ॥క॥
తనువొకచో మనసొకచో
తగిన వేష మొకచోనిడి
జనుల నేచువారికి జయమౌనె
త్యాగరాజు ॥కనుగొన॥

### శహాన - రూపకతాళము

రఘుపతే రామ రాక్షసభీమా
భృగుసుత మదహరా
ఆశ్రితబృందవందిత చరణా ॥రఘు॥
సరసీరుహనయనా సజ్జనహృదయనికేతా
ధరణీధర సీతామనోహరా
సిరవధికసుఖదా ప్రమేయ
నిరుపమపరదా సుగేయా
శరధృతశరజాలనీల
ఘనవర్ణాపరపాల ॥రఘు॥

### శుద్ధబంగాళము-ఆదితాళము

రామభక్తిసామ్రాజ్య మేమానవుల కబ్బెనో ॥మనసా॥
ఆమానవుల సందర్శన మత్యంతబ్రహ్మానందమె ॥రా॥

ఈలాగని విన్నవింపలేను
చాలాస్వానుభవవేద్యాము
లీలాసృష్టి జగత్త్రయమనే
కోలాహల త్యాగరాజనుతుడౌ ॥రామ॥

## బలహంస - ఆదితాళము

నిన్ను బాసి యెట్లా యుండుదురో
నిర్మలాత్ములౌ జనులూ
అనఘసుపుణ్యా అమరవరేణ్యా
సకలశరణ్యా సత్కారుణ్యా ॥నిన్ను॥
కనులకు చలువా చెవుల కమృతము
వినురసనకు రుచి మనసుకు సుఖము
తనువు కానందము గల్గజేసే
త్యాగరాజహృద్ధర్మ పూర్ణకామా ॥నిన్ను॥

## తోడి - ఆదితాళము

కడతేరరాదా మనసా
ఎడలేక భజనచేసినీ
యెడగల్గు నిజాదల్బరలు దెలిసీ ॥కడ॥
ఖలచిత్తప్రాకికమనే శత్రిం
ఖలమందు తగలక నేటూ
ఖలబద్ధుని నిజదాసుడై

నిలసిల్లు త్యాగరాజు మాటవిని
కడతేరరాదా మనసా ॥కడ॥

కుంతలవరాళి—ఆదితాళము

చెంతనే సదా యుంచుకోవయ్యా
మంతుకెక్కు శ్రీమారుతిరీతిగా శ్రీ
తలచిన పనులను దెలిసీ
తలతో నడచి సంపసిల్లుకురా
పలుమారుబల్క పనిలేదు రామా
భరతూనివలె త్యాగరాజనుతి ॥చె॥

కుంతలవరాళి — ఆదితాళము

శరశర సమరైక శూరా
శరధి మదవిదారా
సురరిపుమూలా బలమను తూలా
గిరుల శనలపమమా శ్రీరామా ॥శర॥
తొలినేజేసిన పావనకుమార నామా
కలనయినను శాయగలేనీ
బాలుని విరచి వెలసిన శ్రీరఘు
కులవర భోగమము త్యాగరాజనుతా ॥శర॥

# త్యాగరాయ కృతులు

## సావేరి — ఆదితాళము

రామా బాణత్రాణశౌర్య
మేమాని పొగడుదురా
భామాకానవడు రావణు బూలా
బలములనెల్లా కూలాచేయు ॥రామా॥
తమ్ముడు బడలిన వేళ సురరిపు లెమ్మని
చక్కరపంచీయగని లెమ్మనుచు నిద్రాబలిమి
సమయమ్మని లేవగా సమ్మతితో నిలబడి కోడ.
రాజ్యఘోషముల జనులజేసి తా
నెమ్మదిగల తోడనుజూచెనురా
నిజమైన త్యాగరాజనుతుడౌ ॥రామా॥

## మోహనరాగము — ఆదితాళము

భవానుత నాహృదయమూనర
మీఘ్రాబడలికదీరా ॥భవా॥
భవతారకా నాతో బాగూగపలికిన
బడలికదీరా కమలసంభవా
పవసుతా ప్రియతనకైతికిసి
బడలికదీరా ॥భవా॥
పవనమూ జేరిసను వెరపించిన
బడలికదీరా కమలసంభవా

శంకరాభరణము — ఆదితాళము

ఎందుకూ పెద్దలవలె బుద్ధియ్యవూ
ఎందుబోదునయ్యా రామయ్యా ॥ఎం॥
అందజీవలెదాటిదాటితిరిగి
అందరానినీపదయుగళముకై రామయ్యా ॥ఎం॥
వేదశాస్త్రతత్వార్థములూ దెలిసి
భేదరహితవేదాంతము దెలిసి రామయ్యా ॥ఎం॥
నాదవిద్యామర్మంబులు దెలిసి
నీవాదత్యాగరాజానుత నిజముగ ॥ఎం॥

శంకరాభరణము — ఆదితాళము

మరియాదగాదురా కరుణాకరా – వారినీవిరినీ
సరిచేసి చూచుచుండేదీ ॥మరి॥
రాగము తాళము రక్తి భక్తి జ్ఞాన
యోగము మరియానురాగము లే నీ
భాగవతులు ధరాశయాను లేకానీ
త్యాగరాజార్చిత తారకాచరిత ॥మరి॥

సరస్వతిమనోహరి – ఆది

ఎంతో వేడుకొందు ఓ రాఘువా
వంతచేలరా ఓరాఘువా

చింత దీర్చునట కెంత సేపు డిరా
అంతరాత్మ నాచెంతరానునే ॥నెం॥
చిత్తమందూ నిన్ను జూచు సౌఖ్యమే
ఉత్తమం బనుచు నుప్పొంగుచునూ
సత్తమాత్రమూ చాలా నమ్మితిని
సార్వభౌమ శ్రీత్యాగరాజనుత ॥ఎం॥

జనరంజని —— ఆది

స్మరణే సుఖం । రామనామస్మరణే సుఖం
నరుడై పుట్టినందుకు సతమూ రామనామస్మరణె సుఖం
వరరాజరాజయోగమే నిష్టతా
వారికానంద మయ్యేట్టు ॥స్మర॥
రామనామ శ్రవణంబునిండీ
నామరూపమే హృదయంబునిండి
ప్రేమబుట్టగ సేయగ లేర
నిష్కామత్యాగరాజు – సేయునామ ॥స్మర॥

ఆరభి —— ఆది

సాధించేనే ఓమనసా
బోధించిన సన్మార్గవచనములా
బొంకుజేసి తాపట్టినపట్టూ ॥సా॥
సమయానికి తగుమాటలాడేనే
దేవకీవసు దేవుల నేగించినపట్టూ
రంగేశుడు సద్గందాజనకుడు

సంగీత సాంప్రదాయకుడు ॥మన॥
గోపీజన మనోరథమొసంగ లేకనే
గేలియు జేసేవాడు
వనితల సదా సౌక్య-జేయుచును
మొక్క-జేసే పరమాత్ముడదియుగాకా
యశోదతనయుడంచు ముదంబు
ననుముద్దుపెట్టు నవ్వుచుండుహరి ॥మన॥
పరమభక్తవత్సలుడు సుగుణపారావరుం
డాజన్మమనఘు డీకలిబాధల దీర్చునా
సనుచు నేహృదయాంబుజంబున జూచుచుండగ ॥మన॥
హరే రామచంద్రా రఘుకులేశ
మృదుసుభాష శేషశయన పరనారీసోదరా
రాజవిరాజ తురగరజ
రాజనుతుని రామయా వఘున
సరసీరుహాళదాక్ష యనుచు
వేడుకొన్న నన్ను తా బ్రోవాకన్ను ॥మన॥
శ్రీవెంకటేశ సుప్రకాశ సర్వోన్నత
సజ్జనమానసనికేతన కనకాంబరధర
లసన్మకుట కుండల విరాజిత హరేయనుచు నే
పొగడలే త్యాగరాజగేయుడు
మానవేంద్రుడైన రామచంద్రుడు ॥మన॥

కళ్యాణి - ఆది

ఏతావునరా నిలకడనీకు
ఎంచిచూడ నగుపడవు
సీతాగౌరి వాగీశ్వరీయను
శ్రీరూపములందా గోవిందా
భూకమలార్కానిలనభములందా
లోకకోటులందా
శ్రీకరుడగు త్యాగరాజకరార్చిత
శివమాధవ బ్రహ్మాదులయందా ॥ఏ॥

శ్రీరంజని - దేశాది.

భువినీదాసుడని పేరాశచే
బొంకులాడితినా బుధమనోహరా ॥భు॥
అవివేక మానవుల కోరికోరి
అడ్డత్రోవ ద్రొక్కితిని బ్రోవవే ॥భు॥
చాలసౌఖ్యమో కష్టమునో విను
జాలిజెందితి సరివారిలో పాలముంచినా
నీటముంచినా పదములేగతి త్యాగరాజనుత ॥భు॥

హమీరుకళ్యాణి-ఆది

మానములేదా తనవాడని యభిమానములేదా ॥మా॥
గానమురా నీవలె నిరోష్ఠ్యహీని

గానరుచి దెలియ కుశలవజనక
మీనముఖమున రవితనయుడు
ననుబాసలు పల్కగ రోసముతో ॥మా॥
సింహాసనాధిపతి జేసిననీకు
దాసుడైన త్యాగరాజకరార్చిత ॥మా॥

కాంభోజి — దేశాది

మా జానకీ చెట్టబట్టగ మహారాజువైతివి ॥మా॥
రాజరాజవర రాజీవాక్ష
వినురావణారి యని రాజిలుకీర్తియు ॥మా॥
కానకేగి యాజ్ఞ మీరక
మాయాకారమునిచి శిఖి చెంత నేయుండి
దానవుని వెంటనే చని
యశోకతరుమూలనుండి వానిమాటలకు
గోపగించి కంట వధియించకనే యుండి
శ్రీనాయక యశము నీకే
గల్గచేయలేదా త్యాగరాజపాలిత ॥మా॥

ఉదయరవిచంద్రిక — దేశాది.

ఎంత నేర్చిన ఎంతజూచిన
ఎంతవారలైన కాంతదాసులే ॥ఎ॥
సంతతంబు శ్రీకాంత స్వాంత

సిద్ధాంతమైన మార్గచింత లేని వా ॥రె॥
పరహింస పరభామా న్యధన
పరమానవాపవాద పరజీవనాదుల
కనృతమే భాషించెదరయ్యా త్యాగరాజనుత ॥రె॥

తోడి - ఆది

చేసినదెల్లా మరచితివో ఓ రామ రామ ॥చే॥
ఆసకొన్నట్టి నన్నలయించుటకు మున్ను ॥చే॥
ఆలునికైన భక్తురాలనుచు నాడు
పాలుమారక రవిబింబమున వెలయించవు ॥చే॥
బాసతప్పక విభీషణుని కోర
కాదిశేషుడగు తమ్ముని పోషించుమని రాజు ॥చే॥
రామా శ్రీత్యాగరాజ ప్రేమావతార
సీతాభామ మాటలు చెప్ప శ్రీమారాజనేమ బ్రహ్మ ॥చే॥

ఆభోగి - ఆది.

మనసునిల్ప శక్తిలేకపోతే
మధురగంట విరులపూజ యేమి చేయును ॥మ॥
ఘనదుర్మదుడై తామునిగితే
కావేరి మందాకిని ఎటుబ్రోచును
సోమిదమ్మ సొగసుగాండ్ర గోరితే

సోమయాజి స్వర్గార్హుడౌనా
కామక్రోధుడు దవమొనరించితె
కాశి రక్షించునో త్యాగరాజనుత॥ప॥

ఖరహరప్రియ – త్రిపుట

పక్కలనిలబడి గొలచె
ముచ్చటబాగ తెల్పరాదా
చుక్కలరాయని గేరుమోముగల
సుదతీ సీతమ్మ రామునికిరు ॥ప॥
తనువుచె వందనమొనరించు చున్నారా
చెనవున నామకీర్తన జేయుచున్నారా
మనసునదలచి మైమరచి యున్నారా
నెనరుంచి త్యాగరాజునితో హరిహరి మీరిద్దరు ॥ప॥

దేవగాంధారి – ఆది

క్షీరసాగర శయన నను
కలతలు బెట్టినలెనా రామ
వారణరాజును బ్రోవను వేగమె
వచ్చినది విన్నానురామ ॥క్షీ॥
నారీమణికి చీరలిచ్చినది
నాడే నే విన్నానురా రామ

ధీరుడౌ రామదాసుని బంధము
విప్పినది విన్నానురా రామ
నీవనజాక్షికై నీరధిదాటిన
నీకీర్తిని విన్నానురా రామ
తారకనామ త్యాగరాజానుత
దయతో నేలుమో రామ ||క్షి||

## సింధునామక్రియ — దేశాది

దేవాధిదేవ సదాశివ
దీననాథసుధాకర దహనయన
దేవేశ పితామహ మృగ్యశమాది
గుణాభరణ గౌరీరమణ ||దే||
భవచంద్రకళాధర నీలగళ
భానుకోటిసంకాశ శ్రీశనుత పాప నాశ
భక్తిందేహి దేశబంధో
దరహాసవదన త్యాగరాజనుత ||దే||

## జయమనోహరి — రూపకము

నీభక్తి భాగ్య సుధానిధి నీదే జన్మము
భూభారముగాని సుర భూసురుడై జన్మించిన ||నీ||
వేదోక్తమౌ కర్మము వెతగల్గు గతాగతమా
బోధాత్మక త్యాగరాజ నుతాప్రమేయ సదా ||నీ||

## కమాచ్ — రూపకము

సుజనజీవన రామ సుగుణభూషణ రామ
భుజగభూషణా ర్చిత బుధజనావనా రామ ॥సు॥
అజవందిత శ్రితచందన దశతురంగమా రామా
చారునేత్ర శ్రీకళత్ర శ్రీరమ్యగాత్రా
తారకనామ సుచరిత్ర ॥సు॥
దశరథపుత్ర తారకాధిపానన ధర్మపాలకా
తారయరఘువర నిర్మల త్యాగరాజసన్నుత ॥సు॥

## అఠాణా — రూపకము

నారదగానలోలనుత జనపరిపాలా ॥నా॥
నీరదసమనీల నిరుపమగుణశీల
నీవులేకయే తనువులు నిరతముగా
నడుచును నీవులేకయే తనువులు
నిక్కముగా మొలచును నీవు లేకయే
వానలు నిత్యముగా కురుసును నీవులేక
త్యాగరాజు నీగుణములనెంచు పాడును ॥నా॥

## శంకరాభరణము — ఆదితాళము

ఏమినేరము నన్నుబ్రోవ
ఎంతభారము నాపల్ల ॥ఏ॥

సామరాజ వరదుడని మునుల
సత్కీర్తి గల్గలేదా నాపై ॥ఏ॥
దీనబంధువు దేవదేవుడ
సమానఘనుడని ధర్మాత్ము
డనుచు జ్ఞానదీనులు గుణగానముచేయ బిరాన
చూడవు త్యాగరాజార్చిత నాపై ॥ఏ॥

ఖరహరప్రియ — ఆది

ఎవరని నిర్ణయించేదిరా నిన్నెట్లా
నుతించేదిరా నరవరనిన్నె ॥ఏ॥
శివుడనో మాధవుడనో
కమలభవుడనో పరబ్రహ్మమనో ॥ఏ॥
శివమంత్రమునకు మాజీవము
మాధవమంత్రమునకు రాజీవము ॥ఏ॥
ఈవివరము తెలిసి ఘనులకు
మ్రొక్కెద వితరణగుణ త్యాగరాజనుత ॥ఏ॥

సారంగ రాగం — దేశాది తాళం

ఎంతభాగ్యము మాపాల గల్గితివి
ఎవ్వరీడుముజ్జగములలో ॥ఎం॥

చెంతజేరి సౌజన్యుడై పలికి
చింతబాగ తొలగించి బ్రోచితివి ॥ఎం॥
మున్ను నీ సమీపమున వెలయు
సన్మునుల నెల్ల నదిమీది లీలలచే
చిన్నగాను పాలనము జేసినట్లు
నన్ను గాచితివి త్యాగరాజనుత ॥ఎం॥

కామవర్ధని — ఆది

రఘువర మరువతగునా ॥ర॥
రఘుధర భక్తజనాఘ నివారణ ॥ర॥
తల్లిదండ్రి యన్నదమ్ములుయున్న
పాలతిఁ మొక్కడు పురుషుడుయౌనా ॥ర॥
పరదైవములు బాగుసొమ్ములు
సురతను మంగళసూత్రములోనా ॥ర॥
జేసినపుణ్యచయము బ్రహ్మణ్య
ఆసనొసంగితి అనుపమలావణ్యవతి ॥ర॥
వాసనను నీ కేమలులుల గొన్నాను
సజ్జనహిత త్యాగ రాజనుతశుభాకర ॥ర॥

కళ్యాణి — రూపక

భజన సేయ వేమనసా పరమభక్తి
అజరుద్రాదులకు భూసురాదుల కరుదైనరామ

నారదశ్రవణవ సప్తస్వర వేదవర్ణశాస్త్ర పురాణాది
చతుష్షష్టికళల భేదముకలిగె నాదకరశరీర మెత్తి
ముక్తిమార్గమును తెలియని వాదతర్కమేల
శ్రీమదాది త్యాగరాజనుతుతి ॥భ॥

## తోడిరాగం – ఆది

కద్దనువారికి కద్దుకద్దని మొరలనిడు
పెద్దలమాటలు నేడబద్ధమౌనో ॥క॥
అద్దంపు చెక్కిళ్ళచే
ముద్దుగారు మోముచూడ
బుద్ధిగల్గినట్టి మాకెదురావదేమిరా ॥క॥
నిద్దర నిరాకరించి
ముద్దుగా తంబురబట్టి
శుద్ధమైన మనసుచే సుస్వరముతో
పద్దుతప్పక భక్తపాలనము చేయు
తద్దయశాలివి నీవు త్యాగరాజసన్నుత ॥క॥

## పూర్ణచంద్రికారాగం — ఆది

పలుకవేమి నా దైవమా
పరులు నవ్వునది న్యాయమా ॥ప॥
అలుగ కారణ మేమిరా రామ
నీవాడించినట్లు ఆడిననాతో

తల్లిదండ్రి భక్తి నోసగి రక్షించిరి
తక్కినవార లెంతో హింసించిరి
తెలిసి వ్రారకుండేది ఎన్నాళ్ళురా
దేవాదిదేవ త్యాగరాజునితో ॥బ॥

దేవమనోహారిరాగం - దేశాధితాళము

కన్నతండ్రినాపై
కరుణమానకేగాసి తాళనె
నన్నుచేయుపనులు నేడుగాక
వేరెన్న లేదనుచు వేమారుపలుకు ॥క॥
ఎదురుదాననే ఇంగితంబెరిగి
చెదరనీక పంచేంద్రియమణచి నిను
వదలలేని ధైర్యశాలిగాదని
మదనకోటిరూప త్యాగరాజనుత ॥క॥

హరికాంభోజి — దేశాది

ఎంతరాని తన కెంతపోని
నీచెంతవిడువజాల ॥ఎంత॥
అంతకారి నీచెంతజేరి
హనుమంతుడై కొలువలేదా ॥ఎం॥
శేషుడు శివునికి భూషుడు
లక్ష్మణా శేషుడై కొలువలేరా ॥ఎం॥

శిష్టుడు మేని వసిష్ఠుడు
గొప్ప వసిష్ఠుడు హితుడుగా లేదా ॥ఎ॥
నరవరనీకై సురగణములు
వానరులై గొల్వగ లేదా ॥ఎ॥
అగమోక్తమగు నీగుణములు
(శ్రీ)త్యాగరాజు బాడగ లేదా ॥ఎ॥

## బాయకేళిరాగం — ఆది

ఆడ మోడిగలదా రామయ్యమాట ॥ఆ॥
తోడునీడ నీవె యనుచును
భక్తిగూడిన పాదము బట్టిన నాతో ॥ఆ॥
చదువులన్ని దెలిసి శంకరాంసుడై
సదయుడాసుగ సంభవుడు మొక్క
కదలుదమని బల్క జేసితివిగాకను
త్యాగరాజు యాడినమాట ॥ఆ॥

## జింగ్లరాగము — ఆది

అనాథుడను గాను రామ నే
అనాథుడవు నీవని నిగమజ్ఞుల
సనాతనుల మాటవిన్నాను నే ॥అ॥
సిరాదామరపు జూచి నీకలి

నరాధము లనెదరు పురాణపురుష
పుర రిపుతన దాగ రాట్ప్రియన త్యాగరాజనుత

వరాళిరాగం — దేశాది

కలినరులకు మహిమలు
దెలిసి యేమిఫలము లేదా ॥క॥
ఇలను వెలయు పీఠవృషభాదుల
కటుమలరుచి దెలిసియు చందముగాని
దారసుతులకై ధనమునకై
యూరుపేరులకై బహుపెద్దతజమునకై
సారెకు భక్తవేషము గొనువారికి
తారకనామ శ్రీత్యాగరాజార్చిత ॥క॥

మధ్యమావతి — రూపకము

అలకలల్లలాడగ గని
యారాణ్ముని ఎటుపొంగెనో
చెలువు మీరగను
మారీచుని మదమణచు వేళ
మునిగనుసైగ దెలిసి
శివదలువును విరచెడి సమయమున
త్యాగరాజ వినుతుని మోమున రంజిల్లు

### నాయకిరాగం - ఆది

నీభజనగాన రసికుల
నే నెందుగానరా రామ
శ్రీభవ సరోజాసనాదిశచీ
మనోరమణవంద్య ఇలలో
సగుణ నిర్గుణ నిజము దెల్పుకలను
షణ్మతములమార్గ మష్టసిద్ధుల
పగలుజూప సంతసిల్లగంటిని
త్యాగరాజవినుత॥

### హరికాంభోజి - ఆది

చనితోడితేవే ఓ మనసా
కనికరముతో గనకశిఖరమునిటి
చిరకాలము సుఖమనుభవింపవేగమే ॥ప
పతితులబ్రోచు పట్టాభిరాముని
పరమార్థనుత విశిష్టానుసారుని
ద్యుతినిర్జిత శతశ జరాదిని
ధురీన త్యాగరాజహృచ్ఛారిని ॥చ॥

### హరికాంభోజిరాగం-ఆది

దినమణివంశ తిలక
లావణ్య దీనశరణ్య

మనవిని బాగుగా మదినిదలంచుచు
చనవున నేల జాలుగా జాలు ॥ది॥
సర్వవినుత నను సంరక్షించను
గర్వము ఏల గాచువారెవరే
నిర్వికారగుణ నిర్మల కరధృత
పర్వత త్యాగరాజ సర్వస్వమా ॥ది॥

యదుకులకాంభోజి - దేశాది

ఏతావున నేర్చితివో రామ ఎందుకింతగాసి
సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న
వాతాత్మజులతో నాడునాటక
ములు వజ్రాల సొమ్ములడిగిరో
అనుజులు తల్లిదండ్రులు అన్న
నడిగిరో శ్రీలురయిన వరభక్తులుబిలంరో
చిరకాలము త్యాగరాజనుతనీవే ॥ఏ॥

సురటిరాగం - రూపకతాళం

భజనపరులకేల దండపాణి
భయము మనసా రామ ॥భ॥
అజరుద్రసురేశుల కక్షయాస్త్రాస మొసంగురామః ॥భ॥
అండకోట్లనిండిన కోదండపాణి

ముఖము సుహృత్పుండరీకమును
జూచి పూజాపుంజము
నిందుపేమతో గరంగు నివాకములకు
వరదేశ్వాడ పాదదాసుడైన
త్యాగరాజు జేయు రామ

కాఫీరాగం – ఝంపతాళం

మీవల్ల గుణదోషమేమి శ్రీరామ॥మీ॥
నావల్ల నేగాని నళినదళ నయన ॥మీ॥
నమనసునా ప్రేమ నన్నలయ జేసిన
రాజిల్లు శ్రీత్యాగరాజనుత చరణ ॥మీ॥

ఉమాభరణము–ఆదితాళము

నిజమర్మములను దెలిసినవారిని
నీవలయించేది యొకో ॥ని॥
అజగజరక్షక గజచర్మాంబరాది
గుణభేదముల నిలగల్లజేస నవీ ॥ని॥
శ్రుతిశాస్త్ర పురాణవివాది
షణ్మతస్థల నామవరాదుల
శ్రీపతులంగ మతులుగా జేసిన ॥ని॥
ప్రేమ త్యాగరాజనుత శ్రీమనోహర ॥ని॥

# త్యాగరాయ కృతులు

## భైరవి - ఆది

'శ్రీరఘువర సుగుణాలయ
సరసిజలోచన విలోచనాభ ॥శ్రీ॥
తరాన లేచి చరాకు లేటికి బిరాన
నను బ్రోవగరాదా వాదా ॥శ్రీ॥
కమలాహితనతి కమలాహితధర
మమత దెలిసి నను మన్నించరాదా ॥శ్రీ॥
కనికరమున నను కనికరమున
నిడిచనవున ఒకమనవిని బల్కగరాదా
అగమమూల అవనిజలోల వేగమె
తెలుసుకో త్యాగరాజార్చిత ॥శ్రీ॥

## సారమతి - ఆది

మోక్షముగలదా భువిలో
జీవన్ముక్తులుగాని వారలకు ॥మో॥
సాక్షాత్కారనీ సద్భక్తి
సంగీతజ్ఞాన విహీనులకు
ప్రాణానల సంయోగమువల్ల
ప్రణవనాదము సప్తస్వరములై బరుగ
వీణావాదన లోలుడౌ
శివమనోవిధమెఱుగరు
త్యాగరాజవినుత ॥మో॥

శుద్ధబంగాళ - ఆది

తొలినే జేసిన పూజాఫలము
తెలిసెను నాపాలిదైవమా ॥తొ॥
పలువిధముల నేదలచికరగగా
పలుకక నీవిటు నేనిటుతాగ॥తొ॥
పరివారలలో చౌకజేసి
ఉపరపోషకులను పొరుగునజేసి
హరిదాసరహిత ఘరమున వేసి
పరిజూపకుండగ త్యాగరాజార్చిత॥తొ॥

శుద్ధదేశి - దేశాది.

రఘునందన రాజమోహన
రమియింపవె నామనసున ॥ర॥
నగజానిలజ నారదాది
హృన్నాళికనివాసుడైనగాని (శ్రీ) ॥ర॥
చిత్తమందు నిన్నుంచి
ప్రేమతో జింతించు సద్భక్తుల
నుత్తమోత్తములంచు
నాపదినుంచి పూజి పలేదా
తత్త్వదీక్షా గారణంబు
నీవే తాళజాంసక త్యాగరాజనుత ॥ర॥

# త్యాగరాయ కృతులు

## కాంభోజి - ఆది

మారమణ నిన్నే మొరలిడ
నీ మనసున దయరాదు ॥మా॥
కరిమొరవిని సరగునజను
నీకు గారణమేమి సర్వాంతర్యామి ॥మా॥
కరుణతో ధృవునికెదుట
నిలచిన కథ విన్నానయ్యా
సురరిపై తనయునికై నరమృగమౌ సూచనలేమయ్యా
మరచియున్న వనచరుని బ్రోచిన
మహిమ దెలుపవయ్యా
ధరను వెలయు త్యాగరాజ
సన్నుత తరముగాదిక నే విననయ్యా ॥మా॥

## దేవక్రియ — ఆది

నాటిమాట మరచితివో ఓరామ చిన్న ॥నా॥
మాటిమాటికి నాపై మన్ననసేయుచు
ఏటికి యోచన నీ భాగ్యము నీదను
తరుణులబాగుగ వర్తనములజూచు వేళ
చరణములనిగనినే కరగుచు
సేవించు భరతుని కరచామరమును
సేయుచు కరుణను త్యాగరాజ వరదపదని పల్కిన ॥నా॥

## సరస్వతి - రూపక.

అనురాగము లేని మనసున సుజ్ఞానము రాదు
ఘనులైన అంతరజ్ఞానుల కెఱుకేగాని
వగవగగా భుజించు వారికి తృప్తియౌరీతి
సగుణధ్యానముపైని సౌఖ్యము త్యాగరాజనుత ॥అను॥

## హిందోళము - దేశాది

మనసులోని మర్మమును తెలుసుకో
మానరక్షక మరకతాంగనా ॥మ॥
ఇనకులాప్త నీవేగాని
వేరెవరు లేరు ఆనందహృదయ ॥మ॥
మునుపు ప్రేమగలదొరవై
సదా చనువునేలినది గొప్పగాదయా
కనికరంబుతో నీవేళ
నాకరముబట్టు త్యాగరాజనుత ॥మ॥

## సంతువరాళి - ఆది

శివశివ యనరాదా ॥శి॥
భవభయబాధల నణచుకోరాదా ॥శి॥
ఆగమములనుతియించి బహు
బాగులేనిభాషలు చాలించి
భాగవతులతో పోషించి
ఓ త్యాగరాజసన్నుతుడని యెంచి ॥శి॥

జంఝూటి - త్రిశ్రగతి

నవనీతచోర దేవకి వసుదేవనందనా
వసుదేవనందన యశోదానందనా ॥నవ॥
బృందారకాదివందిత కేశవ భక్తచందనా
యిందీవరదళలోచనా ఆనందచందనా॥నవ॥
బాగుగకూడి నామస్మరణ జేసుకొందమూ
భక్తాలపాదధూళిమనపై జల్లుకొందమూ॥నవ॥
రాజరాజరాజమహారాజశేఖరా
ఓరాజశేఖరా ఓరాజశేఖరా
రాజరాజ సూరత్యాగ రాజశేఖరా ॥నవ॥

చక్రవాకరాగం - రూపకతాళం

సుగుణములే చెప్పుకొంటి
సుందరరఘురామ ॥సు॥
వరుసెరుంగలేక ఇటువత్తుననుచు మరాశచే ॥సు॥
స్నానాది సుకర్మంబులు
వేదాధ్యయనంబు లెరుగ
శ్రీనాయక క్షమించుము శ్రీత్యాగరాజనుత ॥సు॥

కోకిలధ్వని—ఆది

తొలినేనుచేసిన పూజాఫలమిలాగే
పరమాత్మ నీకాయాసపడపనిలేదురా
కరుణాకరా పరభక్తవేషము
చేయువేళ వర్జజాలనేనో త్యాగరాజనుత ॥తొలి॥

భగవాన్ సకలాధీశా పాహి పాపవినాశా ॥శ్రీ॥
వరత్యాగరాజనుతా – వారిజసంభవదాతా
పరమకళ్యాణయుతా పాహిమాం శుభచరితా ॥శ్రీ॥

## హెచ్చరిక

యదుకులకాంభోజిరాగము – ఝంపెతాళము

హెచ్చరికగా రార హేమచంద్రా
హెచ్చరికగా రార హేమగుణసాంద్రా
పచ్చవిల్తునిగన్న పాలితసుచంద్రా ॥హె॥
అణిముత్యాలసరులల్లాడగానూ
వాణిపతీంద్రాదులిరువరుస బొగడగనూ ॥హె॥
మాణిక్యసోపాన మంటపంబుననూ
వీణపల్కు వినుచు వేడ్క జెలగగనూ ॥హె॥
కనకమయమౌ మకుటకాంతి మెరయగనూ
కనరాని కుండల యుగము బాగుగనూ ॥హె॥
నిను జూడవచ్చు భక్తిని కరముజిల్కా ॥హె॥
నినువారిలెల్లాగని విరులచే చిల్కా
ఘనత్యాగరాజు గనుకొని ముద్దుగుల్కా ॥హె॥

## లాలిపాట

నటభైరవిరాగము – ఆది

లాలీలాలీయని యూచేరా వనమాలి
మాలీయని యూచేరా ॥లా॥

రామరామయని పాడేరా
రిపుభీమభీమాయని పాడేరా ॥లా॥
దేవదేవాయని పిలిచేరా భూ
దేవదేవాయని దలచేరా ॥లా॥
రాజరాజాయని బిలచేరా
త్యాగరాజరాజాయని తలచేరా ॥లాలి॥

## ఉయ్యాలపాట

నీలాంబరి — జంపె

ఉయ్యాల లూగవయ్యా
సయ్యాటపాటలను సాత్సార్వభౌమ ॥ఉ॥
కమలజాద్యఖిల సురలూ నినుగొల్వ
విమలత పూనీ మునీంద్రులు ధ్యానింప
కమనీయభాగవతులూ గుణకీర్తనములు
నాలాపములు సేయగ ॥ఉ॥
నారదాదులు పలయుచు శ్రుతిజెందు
సారములు బాగవినుచు — నమ్మువారలసదా
బ్రోచుచు వేదసారఫలములు జూచుచు శ్రీరామ ॥ఉ॥
నవమోహనాంగులైన పురసతులు
వివరముగ బాడగనూ — చోద్యమున
నవరత్న మంటపమున నాత్యాగరాజుని
వినుతకృతి బూనర ॥ఉ॥

## పవ్వళింపు - పాట

### నీలాంబరిరాగం — ఆది

శ్రీరామరామరామా శ్రీమానసాబ్ధిసోమా
నారాయణాంగనామా నళినాక్షా పవ్వళించూజన
శ్రీజనక రాజుంటబుట్టి జానకిని చెట్టబట్టి
కనకమా సురటిబట్టి గానునది పవ్వళించూ ॥శ్రీ॥
పక్షి వాహనముగాదు పూర్ణమహాభక్తితోను
నిర్మలులను భజియించుచు పూజించు పవ్వళించు ॥శ్రీ॥
అనుకానరిశయనా అంభోజపత్రనయనా
ఆశతో త్యాగరాజు ఆర్చించ పవ్వళించూ ॥శ్రీ॥

## మంగళము

### సౌరాష్ట్ర రాగము-ఆది

నీనామరూపములకు నిత్యజయమంగళం ॥నీ॥
పవమానసుతుబట్టు పాదారవిందములకు ॥నీ॥
పంకజాక్షి నెలకొన్న పంకాయురమునకు ॥నీ॥
నళినాతిరుగేరునగు మోమునకు ॥నీ॥
నవముక్తాహారములు నటించుయురమునకు ॥నీ॥
ప్రహ్లాదనారదాది భక్తులు పొగడుచుండు ॥నీ॥
రాజీవనయన త్యాగరాజా వినుతుడైన ॥నీ॥

త్యాగరాయకృతులు - సంపూర్ణము.

---

శ్రీ కన్యకా ప్రెస్, విజయవాడ.